హరియు మోహినిగాఁగ సతినితో రతికేళిఁ గలసి సత్పుత్రుని గాంచినావు
ఇట్టి నీలీల లెన్న నే నెంతవాఁడఁ, గరుణ నన్నేలు సౌభాగ్యవరము లొసఁగి, రా॥

శూరాదిదనుజప్రవీర బాధలకోడి బ్రహ్మాదిదేవతల్ ప్రస్తుతింప
దేవేశ భవదీయతేజం బొసంగిన వేమాఱు ఱెల్లులోఁ బ్రేమ నుంచి
షట్పిండములుగాఁగ షట్కృత్తికలుఁ జూచి షడ్భావసహితలై సాఁకిరెలమిఁ
గాత్యాయనీదేవి కరుణతో షట్పిండములఁ బట్ట నొకటియై మునమెలర్పఁ
బిల్లఁడై యొప్పి భవదాజ్ఞఁ బృథ్విదనుజ, వంశములఁ గూల్చె సేనాని వరదయాంశ॥

అఖిలపురాణేతిహాసు వేదవ్యాసుఁ గణకుంజరాంకుశుఁ గాళిదాసు
దండిని భవభూతిఁ దగ శంకరాహ్వయు మల్హణ బిల్హణ మాఘకవుల
భట్టబాణు మయూరు భారవి వాల్మీకి భవ్యపండితరాయుఁ బ్రౌఢకవిని
శ్రీనాథు భాస్కరు శివభద్రు సలసాని పెద్దనార్య విభూషుఁ బ్రీతిసోమ
యాజిముఖ్యుల నిర్మలాత్మయుతులఁ, జేసి రక్షించితివి గదా సిరిచెలంగ, రా॥

నవరత్నఖచితమౌ నవ్యకిరీటంబుఁ బేదవాఁడును దలఁ బెట్టు పెట్లు
దనుజారివంచు సుధాపూర్ణకుంభంబు నల్పమనుజున కదబ్బు పెట్లు
జలదంబులో మించు సౌదామినీరేఖఁ గని కౌఁగిటను జేర్పఁ గలుగు పెట్లు
పుట్టుభోగులఁ జూచి పొరిఁబొరిఁ బొక్కాడి కష్టాత్ములకు సిరిగల్గు పెట్లు
గాన నీభక్తి లేనట్టి హీనమతికి, నెట్లు ప్రాపించు నీసేవ యెన్నిచూడ, రామ॥

ఛందోనిబంధనము ల్పరికించి చూడఁగ లేదు యతిగణప్రాసవిఖ్యాతి లేదు
అమరకాండత్రయం బభ్యసింపఁగ లేదు నచ్చుహల్లులభేద మరయ లేదు
కావ్యపంచకమైనఁ గనుఁ జూడఁగా లేదు కవిప్రసిద్ధార్థముల్గలవ లేదు
శ్రీశంభుకృపచేతఁ జెప్పితిఁగాని నా శక్తిచేఁ గాదు నీశతకరచన
గాన మత్కృతి సుకవు లహీనకరుణ, నెంచరె మ్యోడఁ జూచినఁ బంచవదన, రా॥

వసుధఁ గోమట్రాజువంశాబ్ధిచంద్రుండు శంకరాభిఖ్యుండు సాంద్రయశుఁడు
సకలవేదాగమశాస్త్రము ల్పరికించి శైవరాట్ఛ్రుఁడని తలఁచి మదిని
వీరశైవాచారవిధి శివదీక్షచే లింగధారణ మయ్యె లీలఁ దనర
దశరథాత్మజుఁడంత దశకంఠుఁ దెగటార్చి శ్రీపర్వత ప్రదక్షిణముఁ జేసె
నా ప్రదక్షిణగతి నతఁ డధికభక్తిఁ, జేసె యుష్మదనుగ్రహ శ్లిష్టుఁ డగుచు, రా॥

ఆశంకరుఁడు బుచ్చమాంబను వరియించి కొమరు శేవురనొకకూఁతుఁ బడసె
నందుఁ గనిష్ఠుండు నతిగుణాఢ్యత్ముఁడు సౌందర్యపరిభూతశంబరారి

యమహితాంబుదోద్ధతి కనిలమై విలసిల్లి నిఖిలమంత్రులలోన నిగ్గుదేలి
దానకర్ణుం డన ధాత్రిలోఁ బొగ డొందె, నాగయలింగంబు నయమహిమను
జక్కమాంబనువరియించి శుభకరముగఁ, గొమరులనునమ్మునేవురఁగోరికనియె॥
అందగ్రజుండును నతిగుణాఢ్యుండగు సింకయ్యయనుపేర వెలసె భువిని
నక్షయంబగు శివదీక్షఁ జెన్నొందుచు నక్షయలింగంబునలరె ధాత్రి
భక్తికి ముంగొంగు పసిఁడియై బసవయ్య భాసిల్లెసౌభాగ్యవతియుచేత
మంత్రమంత్రార్థము ల్మహిమనుచ్చరించుచు లక్ష్మీశలింగంబు లలివహించె
నెన్నవల్వ్వరకన్న నేఁచిన్నవాఁడ, నన్నుఁ గృపతోడఁ బ్రోవుమాపన్నపోష॥
మద్గురుమూర్తియా మహిమనుద్భటారాధ్యవంశాబ్ధిచంద్రుండు వరగుణుండు
షట్చక్రసంధాని షట్కోశరిపుజేత షడ్భావరహితుండు షట్స్థలుండు
కల్మషం బనునంధకారంబునకు శుద్ధసుజ్ఞానదీపమై చూడఁబడును
బరవాదులకు నెల్ల భయదప్రతాపుఁడై వీరభద్రాఖ్యచే వెలసె ధాత్రి
నట్టి మద్గురుస్వామి నే ననుదినంబు, సంస్తవమొనర్తు దుర్వర్ణశైలవాస,రా॥
ఖండితంబుగఁ గాలకంఠుఁడే కర్తంచు దండిబౌద్ధులవాద నుండఁ జేసి
యిల వేదపద్ధతి నీశుఁడే కర్తందుఁ బాంచరాత్రుల చర్చపదటఁ గలిపి
లోకత్రయాచార్య పాకశవిలసిల్లి పండితారాధ్యుండు భవ్యమహిమ
వాదించి పావకు వస్త్రాన సంధించి పరులింక్ష లేకుండ వరలఁ జేసి
నేత్రములుదీసిస్ఫురదూర్ధ్వనేత్రయుగము, వడసె నేమేనినుతియింతుఁ బండితార్య
రామలింగార్యపోష సద్రాజభూష, శరణు శ్రీగిరిమల్లేశ శాంకరీశ. ౨౦
అక్షరోజ్జ్వలభక్తిపాత్రీకబసవని యక్షరంబులె కల్పవృక్షవితతి
యక్షరబసవనామాక్షరంబులు దల్చి పక్షివాహుఁడు లక్ష్మిఁ బరిణయించె
రక్షకాఖ్యబసవు నీక్షించుచున్నట్టి యక్షులులోకాభిరక్షణములు
అక్షీణశివపదాఢ్యక్షమహోక్షాధిపాక్షరనిరతి మోక్షప్రదంబు
గానబసవని నుతియింపఁగలరె పద్మ,జాచ్యుతాదిదేవతలౌర యావనిలోన,రా॥
బసవనీనామంబు పఠించి విన్నను బశుపులకైనను బరఁగుభక్తి
బసవనీకథలెల్లఁ బాటించి నుడివినఁ బసిబాలురకునైన నెసఁగుభక్తి
బసవనీనామంబు పాటించి వ్రాసినఁ బతితులకైనను భక్తిగలుగు
బసవనీపదములఁ బ్రస్తుతిచేసినఁ బామరులకైనను భక్తిగలుగు
బసవబసవాయటన్నను బాపహరము, అట్టిబసవేశ్వరస్వామినభినుతింతు,రా॥

భక్తమండలి కెల్ల భద్రగజోపము మడివాలుమాచయ్య మహిమఁదలఁతుఁ
బరవాదులను జిహ్వవట్టి కోసినదిట్ట మాదిరాజయ్యను మదినిఁ గొల్తు
నంగుళంబులనొత్తి యమృతంబుఁజూపిన యెడపదయప్పన్న యడుగులెంతు
గురుభక్తి వదలక గురుసతీహితబాంధవాళితోఁ గైలాస మలరిచేరు
నట్టి బిల్లమరాజును ననుదినంబు, నాదుమదినిల్పినుతియింతు వేదతురగ, రా॥
కిన్నరబ్రహ్మయ్య కీర్తినుతించెదఁ గన్నడబ్రహ్మయ్య గణుతిచేసి
కల్లిదేవయగారి గాదిలిబంటను గక్కయ్యగారింటి కర్తకరుఁడఁ
జిటితొండభక్తుని జేరి కీర్తించెద వడయునంబికిఁ జేతు వందనములు
గొడగూచి నామదిఁ గొనియాడుచుండెద సక్కమహాదేవికనుఁగుశరణు
ముగ్ధసంగయ్యగారికిముదమెలర్పఁ, బ్రణుతిచేతునుసద్భక్తిపటిమచెలఁగ, రా॥
మోళిగమారయ్య ముసిడిచౌడయ్యయు శూలదబ్రహ్మయ్య సురియచౌడు
బడవలబ్రహ్మయ్య బాబిరాజయ్యయు శివనాగమయ్యయు శివకరుండు
అల్లయ్య మధుపయ్య బల్లేశు మల్లయ్య గోడలమల్లయ్య గోహిరుండు
నాదిగాఁ గలయట్టి యమితగణావళి నూతనప్రమథుల నూలుకొల్పి
శరణుశరణంచుఁ దత్పాదజలజమాత్మ, నిలిపి వినుతింతునిత్యంబు నేర్పుమీఱ॥
పరఁగ నసంఖ్యాతప్రమథగణంబుల వర్ణించి లెక్కింప వశమె విధికి
భూతగణంబుల ముదముతో లెక్కింప నాదిశేషునకైన నగునె వశము
శుద్ధవైదికశైవసిద్ధాంతగణముల గణనకు శక్యంబు గాదు హరికి
రూఢప్రతాప సద్రుద్రగణంబులఁ బరికింపశక్యమే భారతికిని
నిట్టిగణసంఖ్యచేయఁగానిలనువశమె, పుండరీకాక్షబాణ యంభోధితూణ, రా॥
పరఁగ శిలాదుఁ డన్వరమమునీంద్రుండు పుత్రసంతతిలేక పుడమిలోన
నావంతపాషాణమాహారముగఁ జేసి నిన్నుఁగూర్చి తపంబు నెఱయఁజేయ
నాఋషితపమున కానందమునఁ బొంగి ప్రత్యక్షమై నీవు ప్రోధిమెఱయ
మెచ్చితి నీతపం బిచ్చెద వరమన్న సిద్ధఋతనయుల నీయు మనిన
నట్ల యగుఁగాక యని పోవ నంతలోనఁ, గొమరులిద్దఱుగలిగిరి కోర్కెదీర, రా॥
అందు జ్యేష్ఠుండగు నందీశ్వరుండును, మహానంది యనుపురి మహిమమించె
బరఁగ రెండవవాఁడు పర్వతాభిఖ్యుఁడు, నబ్జారిధరభవదంఘ్రియుగము
భజియించి మెప్పించి భర్గమహాదేవ నిజబంధుయుతముగా నీవు నాదు
శిరమున నిలుమన్న సిద్ధభక్తాళితోఁ బ్రమథబృందముతోడఁ బ్రమదమునను
వచ్చి నిల్చితి వయ్య నిర్వాణఫలద, పార్వతీనాథ పాలితభక్తయూథ, రామ॥

నిజకాంతినిర్జితనీలమేఘంబయ్యుఁ బృథ్వీపీఠంబుచేఁ బృథులమయ్యు
నంబరంబే తన కధిక లింగముగాఁగ దశదిశ ల్వస్త్రసంతతి యుఁగాఁగ
నక్షత్రములుమూర్ధనవసుమాభనునింప సూర్యచంద్రులునేత్రశోభఁజెలఁగ
గుహలునాసారంధ్రవిహృతిగస్పడఁజేయ వృక్షము ల్తనురుహవృత్తిఁదెలుప
నట్టిరూపంబుతోభువినధికగతిని,నున్న శ్రీగిరిమహిమనేనెన్నఁగలనె, రామ॥
ఒకచాయస్వర్ణరత్నోజ్జ్వలశిఖరంబు లొకవంక మాణిక్యనికరములును
నొకక్రేవ రజతమై యొప్పారుచుండును నొకదిక్కు తామ్రమై యొప్పుచుండు
వజ్రనిర్మితసౌధవాటిక లొకచోట మరకతసానుల మహిమలొకట
నొకయుక్కుప్రాకార మొకవంక గోపుర మొకదండ నాలయమొప్పు దనర
మించు శ్రీగిరి మహిమ నేనెంచఁగలనె,గానఁ దోఁచిన మట్టుకుగణుతి సేతు
రామలింగార్యపోష సద్రాజభూష, శరణు శ్రీగిరిమల్లేశ శాంకరీశ. 30
మల్లికాకుండ సన్మహిమ యెంతనిచెప్ప భూతికుండోజ్జ్వలపుణ్యమెంత
వాగ్దేవికుండంబు వర్ణింపఁ దరమౌనె బ్రహ్మతీర్థము నెట్లు ప్రస్తుతింతు
రుద్రాఖ్యకుండంబు రూఢి యెంతనియెంతుఁ బంచధారలమహిమెంచవశమె
కోలాఖ్యకుండఁబుఁ గొనియాడఁదరమౌనె శంఖకుండోజ్జ్వలసారమెంత
దివ్యతీర్థాన్వితంబైనభవ్యపర్వ,తప్రభావమెంచంగనాతరమెయీశ, రామ॥
సర్వమంగళ నీదు సామేన నొప్పఁగా నంది ముహుర్ముహుర్నుతు లొనర్పఁ
బద్మగర్భుఁడు నిత్యపంచాంగమును జెప్ప జలజనేత్రుఁడు పరాకులను దెల్ప
తుంబురునారదు ల్తంబుఱమీటంగ గంధర్వభామినీగాన మమర
గీర్వాణకోటీరకీలితహారినీలబంభరవ్యాపితపదసరోజ
యుగళశంకరనిన్నునిజోత్తమాంగ,నిలయుఁజేసినపర్వతునేభజింతు, రామ॥
శ్రీమల్లికార్జును సేవింతు నెప్పుడు భ్రామరి నేప్రొద్దుఁ బ్రస్తుతింతు
శిఖరేశ్వరుని నాత్మ సేవింతు సేవింతు గణపతిదేవుని గణుతిసేతు
వృద్ధమల్లన్నను సిద్ధంబు పూజింతు నిందుతీర్థము మదిఁ గొందు నెపుడు
హాటకేశ్వరు నింక నాత్మలోఁ దలపోతు సారంగవిభునినే సన్నుతింతుఁ
బరఁగ శ్రీశైలపట్టణవాసులైన, పారికాంక్షిగణంబును బ్రణుతిసేతు, రామ॥
చెలఁగి శ్రీగిరి నుతిచేయలేక మురారి సితవార్ధిలో శయ్య చేసెఁగాదె
పర్వతమహిమెంచఁ బాటిల్లకనుగదా భువిపూజలేకను బొగిలె విధియు
శ్రీగిరి మహిమను జెప్పలేకయకదా శతధృతి జారుఁడై ధృతినివిడుట

క. కైలాసనివాసునకు, స్వాక్షీక్షణదగ్ధకుసుమబాణాసునకు
ల్లాలితదరహాసునకున్, స్థూలాత్మవికాసునకును సువిలాసునకున్. ౬౧
క. హరునకుఁ గరిదైత్యాజిన,ధరున కనల్పక్షదీక్షదక్షాధ్వరసం
హరునకు భూషాయితఫణి,వరునకు నయనీకృతాబ్జవసుమిహిరునకున్ ౬౨
క. శంసద్వేదాంతోక్తి రి,రంసునకుం గిరిజతనుద్రుమశారా
హంసునకు దీప్తివంచిత, హంసునకు స్రుచిరశశిధృదవతంసునకున్. ౬౩
క. శ్రితజనరక్షాదీక్షా,యుతన శ్రీకృష్ణభూవరాంచితహృదయా
తతసన్నివేశునకుఁ బా,లితలోకేశునకు భీమలింగేశునకున్. ౬౪
వ. సద్భక్తిసమర్పితంబుగా నారచియింపంబూనిన సీతారామచరిత్రం బనుమ
హాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. ౬౫

—। కథాప్రారంభము ।—

క. మును నారదమునివరునిం, గనుఁగొని వల్మీకభవుఁడు కౌతుకమున ని
ట్లనియెం బురుషోత్తముఁ డనఁ, జను నెవ్వఁడు వానిఁ దెల్పు సంయమివర్యా.
క. అనవుడు నారదముని యి,ట్లనుఁ బురుషోత్తముఁ డనంగ నవనీస్థలిలోఁ
దనరు న్రామనృపాలుఁడు, వనజాక్షుం డట్లు మానవత్వము నొందెన్. ౬౭
క. ఆరామునిచారిత్రము, చారుతరం బనఘ ముగుట సతతానంద
శ్రీరంజకముగఁ జెప్పుదు, గారవమున దీని నీ వికఁ విను వత్సా. ౬౮
గీ. అనిన సంతసిల్లి యాపుట్టపుట్టువు, నారదునకు భక్తి నతు లొనర్చి
యానతిం డటన్న నాతఁ డమ్మునిచెంతఁ, జేరి యిట్టులనుచుఁ జెప్పఁదొడఁగె.

—। అయోధ్యాపురవర్ణనము ।—

ఉ. అంబుజకైరవాదికలితాంబులసత్సరయూనదీసమీ
పంబున సర్వసంపదలు భాసిలఁ గోసలదేశ మొప్పు న
ద్రంబుగ నందయోధ్య యనుపట్టన మొక్కటి గల్గు దాని ము
న్నంబుజగర్భుకైవడిని హాళి సృజించె మనుప్రభుండు దాన్. ౭౦
క. తిగయోజనముల వెడలుపు, తిగయిద్దుగయోజనముల దీర్ఘత గనుచున్
జగతీతలమునఁ దగున,న్నగరీమణి చెలువుఁ బొగడ నాకులవశమే. ౭౧
గీ. అఖిలపట్టణంబు లప్పురీమణి చెలువ్వఁ, గని సహింపలేక కలను సేయుఁ
గదిసి వెలిచి పలిచెఁ గావున దానిక, యోధ్యయనెడు నామ మొప్పఁ బరఁగె.

గీ. మాట లేల వేయునేలయవ్వటిసొగసు, వలనువిూఱఁగ వర్ణింపవశముగాదు
ఫణిపతికైన భారతీపతికినైన, హరునికైన మయూరవాహనునికైన. ౨౩

గీ. నలుమొగంబులుగలుగుట వాగ్గురుతులుఁ, దానొకప్పుడెచెప్పనుగానితప్ప
కుండ నారీతి నుడువఁగలండె యనుచు, విధినినిరసింతురవ్వటి విప్రవరులు.

సీ. మునుమున్న కువలయామోదంబు సమకూర్చి జారచోరులనెల్లఁ బడలఁజేసి
యేపుచెందెడుతమోవ్యాపార మడఁగించి సురుచిరసత్కళాదరత మించి
యరిసముదాయంబు నణయంబు వంచించి నిఖిలాగమంబులు నెగడఁజేసి
భూరివిక్రమముచేఁ బూజనీయతఁ బొంది దినదినం బభివృద్ధిఁ జేటఁ గాంచి
మిత్రసాంగత్య మొకనాఁడు మించకుండి
సకలజననేత్రములకు నుత్సవ మొసఁగి
రాజశబ్దంబు తమకు సార్థంబుగాఁగ
రాజు లుండుదు రవ్వీరరాజమునను. ౨౪

చ. నవనిధు లీశ్వరాదరమునం గని వైశ్రవణాభిధానుఁడై
యవనిని సర్వకాలముల నందఱకుం గనరాక కొండమీఁ
ద వసతి సేయుయక్షుఁ డొకదాతయె యంచును యాచకాళికి
న్నవవసురాసు లిత్తురు ఘనప్రభు లవ్వురవైశ్య లెప్పుడున్. ౨౫

చ. మునలియునై హలంబు పాటి మాఁపునఁ దాలిచి వేడ్కతోడుతం
బహులను గాచుచుండు బలభద్రుఁడు పూర్ణవయస్సు గల్గి యి
వ్వసుధ ఫలింప దున్నుచు నవార్యగుణంబుల సజ్జనాళి కిం
పెసఁగఁగఁ జేయు మాకు సరియే యని కల్గుదు రంఘ్రిసంభవుల్. ౨౬

ఉ. అప్పురిలోన హేమమయహర్మ్యసమూహము లద్భుతంబుగా
నుప్పరవీధి నందుకొని యున్నవి సంజియు మిందు లేదు నే
ర్పొప్పఁగ వానిపై మెలఁగుచుండు మృగాక్షుల కీర్తి రాత్రి నె
ల్లప్పుడుఁ జంద్రమండలసమాస్య లటన్న సమాఖ్య లబ్బుటన్. ౨౭

సీ. వలనొప్పు మేడల వాకిళ్ళఁ గూర్చుండి వనజాస్య లొక్కొక్క దినమునందుఁ
దమకచబంధగాత్రద్యుతు లభ్రమార్గంబున రవిమయూఖముల నొత్తి
వ్యాపించుచుండఁగా నటత మృదంగబృందములు ధిమింధిమింధిమి యనంగ
మ్రోయించి సురనదీతోయముక్తావళు ల్ధరణిఁ జల్లఁగాఁ గరము వేడ్కఁ
గాంచిమబ్బులు మెఱపులుఁ గర్జితములు, వానవడగండ్లఁ బోడమెనవార్యలీలఁ
బొలుచువర్షావసరముగాఁ బోలుననుచు, భ్రాంతులగుదురు వేసవిఁ బౌరజనులు.

కం. తుండములు గదలుచుండఁగ, గండంబుల మదము లొలవఁగా నగరి న్వే
దండములు దిరుగుఁ గాటుక, కొండలవలెఁ గానఁబడుచు గొనబగుగతులన్.

చ. క్షితిధరరాజనందనుఁడు చెల్వగు నప్పురిలో గజంబులన్
హితమతిఁ గాంచి యున్నతి వహించుటఁ దత్సముఁడై తదాఖ్యకై
యతిధృతితోడ నంబునిధియందు మహాతప మాచరించియున్
క్షితి నగజాఖ్యఁ డయ్యెఁ దదశేషతపోబల మేమి యయ్యెనో. ౨౯

గీ. నాగనామంబు గాంచి దానంబు గల్గి, బహుళసారంగహితవృత్తిఁ బరఁగు మాత్ర
నప్రతీకంబులై నట్టియంబుదములు, దరమె యప్పురి నున్న వేదండములకు.

చ. హరిహయుఁ డాజగత్త్రయనియామకుఁ డౌదొరగాన వన్నెకై
హరిహయనామ ముంచుకొని యాహరి నెప్పుడు మోదికుంటచే
హరివర మయ్యె నర్ధహరి యంతియకాని విశేష మెద్ది మా
కరయ రయంబునం దులమె యంచు హసించు సురాశ్వమున్ హయల్.

చ. సకలవిచిత్రవర్ణములఁ జాపనవాభినవోజ్జ్వలన్మణీ
నికరములం గనత్కనకనిర్మితయంత్రముల న్సరోజచం
పకసుమకైరవప్రకరబంధురకాంతులచేఁ గుబేరపు
ష్పకము లనంగ సంతతము భాసిలు నప్పురిలో శతాంగముల్. ౩౨

సీ. పవనంబు నిరతంబు భక్షించి నియమంబుతో నున్నగూఢపదుల వధించి
పరమాదరావాప్తిఁ బ్రబలుచుండెడి పుణ్యజనఘాతియానుమతి సంచరించి
నెలక్రూరరీతిగా నెగడుచుండెడు చండకరు నన్న కధికారిగా ఘటించి
యేవేళఁ దనుఁజూడ నెవ్వారు వచ్చినఁ గడుఁ దెల్లమోముతోఁ గానిపించి
యుండుపతగేంద్రుఁ డెట్టివీరుండు దలఁప, ధర్మనిశ్చయతాకృపోదారవిక్ర
మముల భాసిల్లుమాతోడ సమతఁ బొందఁ, గనిగరుత్మంతు నిరసింతు రచటిభటులు.

కం. ఆవీరభటులశౌర్యము, లేవీటను గాన రావు హేలాయుతుఁడై
యావీరధర్ముఁ డాజికిఁ, దావచ్చిన నరకుఁ గొనడు తతభుజశక్తిన్. ౩౪

ఉ. ఆయతమై సదా కువలయాన్వితమై కనుపట్టు మాత్ర నా
తోయధి సాటియే మధురతోయము లూనెడు నాకటంచు నా
ఖేయము దెల్పెనా నలరుఁ గిందికు దాన సమీరధూతపా
నీయజగంధలోలరమణీయవరాళిమరాళరావముల్. ౩౫

ఉ. ఆపురియందు వప్రశిఖలందు నమర్చిన చారువజ్రతా
రాపతికాంతరత్నములు రాత్రులయం దుడురాశిలోపలం
దాపినయట్టులుండ వనితామణు లెల్లను వానిఁజూచి యా
ఖ్యాపదమూఢతారకలుగా గణుతించుచు నుందు రెప్పుడున్. ౧౬

సీ. అమరావతినిమించి యలరుఁబో యిప్పురమని కాఁపురంబున్న యచ్చరలనఁ
జపలాఖ్యవాయుంగ జలదమండలిఁ బాసి మేదిని విహరించు మించు లనఁగ
యువమృగంబులఁబట్ట నొగి దర్పకకిరాతుఁ డొప్పుగాఁబన్నినయురులనంగ
నకలంక రాజపురావాపి మదిఁ గోరి యిలకు డిగ్గినచంద్రకళ లనంగ
గణుతికెక్కుదు రవ్వీటిగణిక లెల్ల గానసాహిత్యనర్తనమునమృదంగ
వల్లకీవాదనాదులవలను గలిగి, రసికశేఖరచేతోభిరాము లగుచు. ౧౭

క ఆవేశ్యలనేత్రము లిం,దీవరములు వారలుండు నిలయంబులు నిం
దీవరములు తచ్చతురత, లా వారిజభవునకైన నలవియె పొగడన్. ౧౮

సీ వరులవైఖరిఁ జూడ వచ్చినారము నేఁడు చనవున మీరు రాజనము గనుఁడు
సఖులార మీముత్తెసరులు భాసిలుచుండెఁ జంద్రవంకల కివి సాటియగునె
మహిపాలిపై మీకు మక్కువలుండునా పరఁగు నెయ్యము లెల్ల వరులమీఁద
బలరామభోగము ల్గలవె ముద్దియలార కలుగవు చాల మాకాంక్షదీఱ
నని శరస్వరసమ్మోదజనన కార,ణామితరసోక్తు లనుదిన మాడుకొనుచుఁ
దరుణజనశాలిపాలికాసరసిజాత,వదన లుండురు రప్పురీవరమునందు. ౧౯

సీ దండఁ బట్టకొ చూచి దంతియానరో నీవు గోరినసొమ్మిచ్చి కొందు వేగఁ
బట్టి చూచినమాత్ర ఫలమేమి నీకబ్బు నాడనుండియె యిటు చూడరాదె
యీమాట కిటు లంటి వింతి యల్లకుచస్తబకము లిమ్మన్న నేపాటి యగునొ
యిమ్మన నిత్తుమా యెలమి నీదగుసొమ్ము మచ్చికతో ముందు పుచ్చుకొనక
యనుచుఁ దగురీతినర్మోక్తులాడుకొనుచుఁ, బల్లవులఁబుష్పలావికల్ ప్రౌఢిమీఱ
నాపణములందు వసింతు రవ్వీటియందు, సాంధ్యవేళల నత్యంతసంభ్రమమున.

చ. సరయువు మేల్తరంగముల స్నాన మొనర్చుచుఁ బువ్వుఁదోఁటలో
స్థిరమతిఁ గొంతసేపునికి చేయుచు మాదగతు ల్చెలంగఁగాఁ
బురమునఁ జొచ్చి గాఢతరపుష్పధనూరణఖిన్నకామినీ
పురుషుల సేదదేర్చి నుతిఁ బొందుచుందుఁ బ్రభాతవాతముల్. ౨౦

గీ. శుకపికమయూరహంసాలిశోభితములు, భూరిపల్లవఫలపుష్పభూషితములు
రసికరాగమ్యమధ్యధరాతలంబు, లగుచు నుద్యానములు దనరారు నచట.

క. కమలాకరము లనందగుఁ, గమలంబులుఁ గైరవములుఁ గహ్లారంబుల్
విమలమధురాతిశీతల, కమలంబులు గలిగి వెలయుఁ గమలాకరముల్. ౯౩

గీ. పద్మరేఖలచేఁ జాల బాగుమీఱి
కంకణంబులచే మించి కరము మిన్న
పదము దమయందుఁ గనఁబడఁ బొదలు చెలువు
లచటఁ గమలాకరాఖ్యలై యమరు టరుదె. ౯౪

వ. మఱియు లంకాపురంబునుం బోలెఁ బుణ్యజనసేవితం బై కైలాసభూధరంబునుం బోలె రాజశేఖరవిరాజమానం బై సురలోకంబునుం బోలె మహాబలహరియుక్తం బై బలిసదనంబునుం బోలె నహీనివహభయంకరం బై సూర్యమండలంబునుం బోలె ననంతవసురాజితం బై చంద్రమండలంబునుం బోలెఁ గువలయహృద్యం బై గగనంబునుం బోలెఁ దారకాభిరామం బై హిమశైలంబునుం బోలె విద్యాధరసహితం బై యిందిరాహృదయంబునుం బోలె హరిమధురవచనలాలితం బై దేవసైన్యంబునుం బోలె శిఖిగమనసుందరం బై భారతీహస్తంబునుం బోలెఁ బ్రవాళభాసితం బై భృగురామభుజాగ్రంబునుం బోలెఁ బరశుభాసమానం బై కిష్కింధానగరంబునుం బోలె ఘనాంగదసుగ్రీవం బై విరించిస్థానంబునుం బోలె బహునిగమభాసురం బై పురందరాస్థానంబునుం బోలె రంభాగమశోభితం బై చంద్రప్రభాన్వితం బయ్యును బద్మానుకూలం బై పోషితహరిణరాజం బయ్యును గజగమనాంచితం బై సర్వజ్ఞసమాహితం బయ్యును సత్కర్మదక్షాధ్వరవిలసితం బై విరాట్సమేతం బయ్యును భుజంగానందదాయకం బై యొప్పునప్పురంబున కధీశ్వరుండు. ౯౫

—। దశరథరాజవర్ణనము ।—

సీ. సకలరాజన్యమస్తకభూరికోటీరనవ్యరత్నాంశుశుంభత్పదుండు
ఆసముద్రక్షితివ్యాపకనిజకీర్తిచంద్రికాసద్విభాంచద్దిశుండు
పృథుసంగరక్రియాభీతాలయాకృతశైలకందరరిపుజ్యావిభుండు
సకలశాస్త్రాభ్యాసచతురధీరచితవాగ్గణజితచిత్రశిఖండిజుండు
మహితసారసహితకులమండనుండు, సుందరాకారజితరమానందనుండు
ఘనతరానేకవైభవాఖండలుండు, కీర్తిఁ గనుచుండు దశరథక్ష్మావరుండు.

శా. పారావారగభీరుఁ డర్థిజనకల్పక్ష్మారుహం బుజ్జ్వల
త్తారాదారనిభాననుండు రిపుసంతాపక్రియాదక్షుఁ డు
ర్వీరత్నాచతురుండు ధీరుఁడు బలారిస్తుత్యదోర్వీర్యుఁ డా
నారాజన్యకులేశ్వరుం బొగడ శక్యం బౌనె యెవ్వారికిన్. ౯౭

కం. రాజవరార్చితపాదాంభోజుం డచలాధిపత్యపూజితుఁ డగుటన్
రాజశిఖామణి రెండవ, రాజశిఖామణి యనంగ రాజిలుచుండున్. ౯౮

గీ. తనపితామహుని రఘుని దలఁచి యతని
యచ్యుతసమాఖ్య కలరుచు నబ్బ యజుఁడు
తాత కెన యని తా నల్లి దనరఁగోరు
నతఁడు ధరణిఁ బ్రవీణుఁ డై యనరు టరుదె. ౯౯

సీ. బ్రహ్మహత్య నొనర్చి పైకి సర్వజ్ఞనామమున మించినవాని మహిమ యెంత
జగతిలోపలఁ బుణ్యజనవిరోధి యనంగఁ బరఁగువాతని కృపాగరిమ యెంత
పాకారి యితఁ డను లోకవిఖ్యాతిచే వఱలు వాతని వైభవం బదెంత
లలి మిత్రుఁ డై పగ ల్గావించి వెన్క నదృశ్యుఁ డౌ నాతని తేజ మెంత
యనుచు శివకేశవాఖండలాబ్జహితుల, మహిమకారుణ్యవైభవమాన్యతేజ
ములను మీఱు మసంగతం బగు జెలంగు, నమ్మహీనాయకోత్తముఁ డవనిలోన.

వ. ఇట్లనంతబలపరాక్రమధైర్యగాంభీర్యశమదమాదిగుణసంపన్నుండై వర్ధ
మానుం డగు నప్పార్థివుండు సముచితసమయంబున. ౧౦౧

చ. సకలనరేశ్వరు ల్దనవశంబుగ నుండఁగ సూరిసన్నుత
ప్రకటగుణోజ్జ్వలుం డగుచు భద్రపరంపర నాత్మఁ గోరి య
త్యకుటిలవృత్తి. గోసలధరాధిపనందనిఁ బెండ్లియాడె మా
మకు నిజబాహువిక్రమసమాఖ్యలచేఁ గను మెచ్చు గూర్చుచున్. ౧౦౨

కం. కేకయనృపనందన యగు, కైక న్మగధాధినాథకన్య సుమిత్రం
గైకొని విప్రాసికా, నేకాశీర్వచనరచన లెలమిం గనుచున్. ౧౦౩

వ. మఱియు నమ్మహీకాంతుండు రహస్యసమయంబులందు. ౧౦౪

సీ. కోసలేశ్వరజ నీకోసమ వీక్షింపంగ వేగ రానేర నీ వింత యేమి
కైక నే నిన్ను లోకైకసద్గుణ వని కొనియాడుటకు మంచి గుణము లబ్బె
నో సుమిత్రాఖ్య నీతో సుమిత్రతఁ జేయఁ దరముగా దిది యథార్థమ్ము సుమ్ము
మీర లన్యోన్యము మించకుండురు గదా యేలక్షణంబుల నెంచిచూడ

ననుచు నిజకాంతలను జాలనలుగఁ జేసి, మరల సరసోక్తులను బలిమాలుకొనుచుఁ
గలితచందనమాలికాదుల నలంకరించి నిరుపమమోదంబు గాంచుచుండు.

వ. మఱియును. ౧౦౬

సీ. పదములు పద్మము ల్రదములు కుందము లాప్రదాగ్రములు కచ్ఛపములనంగ
గళములు శంఖము ల్లోచనములు నీలము ల్రమ్యజంఘలు మకరము లనంగ
మోము ల్మహాపద్మములు నేత్రకర్ణాదికము లెన్నిచూడ వరము లనంగ
నమరుచున్నవి గాన నిముఁ జూచు నెడ నిధు ల్గలవారిఁ గాంచినకరణిసమ్మ
దంబు నొందుదు నను ముకుంద ప్రవర్ధి, తాతివైభవుఁ గనుచు నోయతివలార
సన్నిధిని గన్న వారల చందమునను, బ్రమదమునఁ బొందుఁడంచును బలుకుచుండు.

క. అని పలుకుచుండు వేళల, ననురాగము మదినిఁ బొదల నతివినయమునన్
జననుతగుణమణు లగు న,వ్వనితలు పల్కుదురు మరల వల్లభుతోడన్. ౧౦౮

క. మీ వచనార్థము లెల్లను, భావింపఁగ మాకు నశమె పార్థివవరసం
సేవితపదయుగ సకలర,సావర పఠికింప మేము సర్వజ్ఞలమే ౧౦౯

క. అసమాంబకుఁడవు విద్యల, నసమాంబకజిత్విరోధి వాకారముచే
ననమాంబకుఁడవు నీ రే,జసమాంబక నీదుమహిమ సామాన్యంబే ౧౧౦

గీ. ఇనుఁడ వినుఁ నీకరస్పర్శమునను మాకు, మిగులహర్షంబు గల్గుఁ బద్మినులమగుట
జగతిలో గల నినకరస్పర్శమునను, బటుతరామోద మగుఁ గదా పద్మినులకు.

వ. అని యిట్లు సరససల్లాపంబు లాడుచుండు నమ్ముంజువాణుల మందహాససుం
దరవదనారవింద రదకుంద కచమిళింద నయనేందీవర కుచకందుకవిలాసం
బులు గనుంగొని ప్రీతుం డగుచు వారలతోడం గూడి యథేష్టభోగంబు
లనుభవించుచు రాజ్యపాలనంబునం దప్రమత్తుం డై ప్రజ్ఞావిజితసురమంత్రు
లగు మంత్రులవలన సకలప్రయోజనంబులు నిర్వహించుచుఁ జారులవలన
నానాదేశవృత్తాంతంబు లాలకించుచు సామదానభేదదండంబు లను చతు
రుపాయంబులఁ జతురుం డై దీనాంధబధిరకుబ్జానాథ జనంబులమనోరథం
బులు సఫలంబు సేయుచు బుధజనస్తూయమానుం డై జనానురాగంబు
గలిగి శాశ్వతైశ్వర్యశోభితుం డైన యద్దశరథేశ్వరుండు పెద్దకాలంబు సకల
సుఖంబులం దనియుచుండి యొక్కనాఁడు. ౧౧౨

గీ. తనకు సుతులు లేమి దలఁచి నెమ్మదిలోనఁ, జాలవగచి విహితజనులఁ గూర్చి
సుతులు లేకయున్న గతి లేదు గావున, వెలయు సుతులఁ బడయవలయు ననుచు.

సీ. ఒకచోటఁ గవిరాజు లొకవంకఁ దార్కికు లొకచక్కి నిపుణశాబ్దికసమాజ
మొకదెసఁ బౌరాణికోత్తము లొకయిక్క ననఘార్కసోమసిద్ధాంతవేత్త
లొకపక్క నిగమవాక్ప్రకరార్థవాదజ్ఞు లొకకడఁ జతురవైణికజనంబు
లొకక్రేవ సామంతు లొకచాయ గణకాళి యొక్కచో వీరభటోత్తరంబు
మఱియుఁ దగువారలందందమహితలీల, నుండికొల్వంగ రూపవద్యువతు లెలమిఁ
జామరంబులు వీవంగ సమ్ముదమున, నిండుకొలువుండెఁ గన్నులపండువుగను.

వ మఱియును. ౧౧౭

క. మంత్రుల మతివిజితామర,మంత్రుల రప్పించి యందు మహితప్రజ్ఞా
తంత్రుండై కడునెగడుసు,మంత్రుం గని యిట్లనియె మనుజేంద్రుఁడొగిన్.

ఉత్సా. ఓసుమంత్ర నీసుమంత్రయుక్తిశక్తిచేత నే
వాసిగల్గి ధరణి యిన్నివత్సరంబు లేలితిన్
భూసురేంద్రు లింక నన్నుఁ బొగడఁ దురగమేధము
న్బాసురముగఁ జేసి సుతులఁ బడసి ప్రబలఁగోరితిన్. ౧౧౮

ఉత్సా. కాన నీవు సత్వరముగఁ గదలి మనపురోహితున్
భానుతేజు నవ్వసిష్ఠు బహుతపోధురీణు స
న్మానివంద్యు వామదేవు మఱియుఁ దగినవారలన్
జానుమీఱఁ దోడితెమ్ము సరగ నాదుచెంతకున్. ౧౧౯

గీ. అనిననృపతియాజ్ఞ నొగల ధరియించి, మునులఁ దెత్తుననుచు ముదముతోడ
నరిగి యాసుమంత్రుఁ డవ్వసిష్ఠాదుల, ఘనులఁ గాంచి మ్రొక్కి వినయమొనఁగ.

శా. మారాజన్యకులేంద్రుఁ డార్యజనసన్మాన్యుండు ధీరుండు వి
స్తారౌదార్యపరాక్రముండు బహుశాస్త్రజ్ఞుండు వారాశిగం
భీరుం డిప్పుడు నన్ను మీకడకుఁ బంపెం దోడితె మ్మంచు స
త్కారుణ్యంబున మీరు రావలయు నద్ధాత్రీవిభుం జూడఁగన్. ౧౨౦

క. అనిపల్కఁ దపోధనవరు, లనఘుతపశ్శక్తిచేత నంతయుఁ దమలోఁ
గని కౌతుక మలరఁగ నా,తనివెంట నచ్చి రపుడె దశరథుఁజూడన్. ౧౨౧

వ. అయ్యవసరంబున. ౧౨౨

క. ఎదురేగి నృపతి మౌనుల,పదములకును దనదుఫాలభాగము గదియ
న్ముదమున మ్రొక్కుచు నయా, స్పదమతి నాస్థానమండపముఁ జేర్చె వెసన్. ౧౨౩

క. జాంబూనదాసనములు ర,యంబునఁ దెప్పించి వారి కర్పించుచుఁ బా
ద్యంబర్ఘ్యంబు నొసంగి క్రమంబునఁ బూజించె భక్తిమచ్చిత్తముతోన్. ౧౨౪

ఖడ్గంబు మాతులుంగఫలంబు నభయంబుఁ బునకయు నంకుశమును వరంబు
నురియుయు సూత్రంబుఁ గరములధరియించిశోణిత ప్రియయున్నసొంపుమీఱి
యుగ్రదేవత యని యూహించి తలఁకక, రక్తపుష్పము లనురక్తితోడ
నొనరఁ బూజచేసి వినుతించి ప్రణమిల్లి, యచటఁగొలిచియున్న యవసరమున.

వ. ఆనగరంబుదెసనుండి దిమ్ము రేఁగినయట్లు *తూఁగొమ్ములుఁ బువ్వనం గ్రోవులునుం దప్పెటలును డక్కలును బెక్కువిధంబుల డిక్కలు చెవుడుపఱుపుచు మ్రోయ నవ్వాద్యరవంబునకు బానట మై తమ యార్పులం బెడ బొబ్బలను గిరిగహ్వరంబుల నుపబృంహితంబులుగా గంధపుష్పార్చితుం డగు నొక్క దీనుని నడుమ నిడుకొని కుఱుచ †కానికోలలు మెఱయించుచు బరికెతలల కఱకుఁగొండవులు సనుదెంచిన నప్పరమకారుణికుండు. ౨౬

ఉ. దీనుని నేటి కిచ్చటికిఁ దెచ్చితి రింతట దేవి మెచ్చునే
హీనుఁడు దుర్బలుండు జడుఁ డేడ్చెడి వీఁ డపలక్షణుండు మీ
రీనరుఁ దెచ్చి చూపి జగదీశ్వరి ని ట్లడికింపఁ జూతురే
యేనుఁగు చిక్కెనేని మఱి ‡యెంపలిచెట్టునఁ గట్టవచ్చునే. ౨౭

క. వీనిం బోవఁగనిం డిదె, నే నుత్తమకులుఁడ మాంసనిబిడుఁడఁ బ్రియస
న్మానసుఁడ నన్ను నరబలి, గా నిచ్చిన దేవి మెచ్చుఁ గరుణం బ్రోచున్. ౨౮

వ. అని యద్దేవికి నుద్రేకంబు పుట్ట వాని నిరసించి తాను మెయికొనిన నాబోయలు నీకొండీనినే చంపించుట మే లని వానిని విడిచిపుచ్చి యతనికి నట్ల గంధపుష్పాక్షతాదు లిచ్చి దేవిచేరువ గ ప్పని యతని ముందట నిడి తలంగిన. ౨౯

గీ. మెచ్చుగాఁగ నిట్టి మెకము §సాళించెద, ననుచుఁ జండిమంత్ర మొనరఁ జెప్పి
పూజకుం డొకండు భూమీశుతల ద్రుంప, బెడిద మైనవాఁడియడిద మెత్తె.

క. అతని ప్రభావమునఁ బరా,హతమై తద్గుణము మెచ్చి యయ్యెడ నాదే
వత యడిదము గొని మఱినా,తత మగుకోపమున వానితల దెగ నడిచెన్.

శా. ఆపాపాత్ముని నట్లు ద్రుంచి నవరక్తాస్వాదనప్రీతయై
భూపాలోత్తముధర్మముం దయయుఁ దెంపు న్మెచ్చుచుం బ్రేతభూ

---

* తూఁగొమ్ములనుం బువ్వనగ్రోవులనుం దప్పెట్లుం దింట్లును ఢక్కలును(డిం:ట్లను అనుటకు, నుంట్లును అనియు) †కాసులతోఁ గొఱకలు మెఱయిం- ‡యెంపలిచెట్టు అని వాడుక, రొంపలి యని యుండు ప్రయోగము. §సాధించెద-

తోపేతంబుగ డాకినీసను దయుం బుప్పొంగుచు న్నర్తన
వ్యాపారంబులఁ దోడుసూపఁ జెలఁగెఁ వ్యక్తస్వరూపంబునన్. ౩౨

ఉ. అంతఁ బ్రసన్నుఁడై నిలిచి యా రతిశరణ్యుని నిన్ను మెచ్చితిం
జింతిత మైన కార్య *మిదె చేకుఱ నిచ్చెద వేఁడు మన్న భూ
కాంతుఁడు మ్రొక్కి నీకు కృప గల్గిన నేమి కొఱంత నేఁడు నా
కింతియు చాలు మర్త్యబలి యెన్నఁడుఁ గోరక పూజ లొందుమా. ౩౩

మ. అని ప్రార్థింపఁగఁ బూజకుం డట దివ్యాకారుఁడై యంబరం
బున భాసిల్లుచు నిల్చి ఖేచరుఁడఁ †గర్పూరాంగుఁడ న్నేఁ గుబే
రుని శాపంబున స్రుక్కి యీగతి నతిక్రూరుండ నై యిచ్చ డో
జననాథా భవదాగమంబు కలిమి న్పాపావధిం బొందితిన్. ౩౪

క. నావుడు వెఱఁ గందుచు నీ, కేవిధమున శాప ‡మయ్యె నీకథ తెలియం
గా వినిపింపుము మాకని, భూవల్లభుఁ డడుగ దివ్యపురుషుఁడు నల్లెన్. ౩౫

గీ. ధనదు దేవపూజ కనువగు క్రొవ్విరు, లెచట నైనఁ గోసి యేన తెత్తుఁ
×దెల్లవాఱ విరులు దేనొకనాఁ డేగి, మధువనమున న్క్రమముగ వఁ గంటి.

క. అన్నెలఁతుక యెదురను సుర, పొన్నలు గోయంగ వచ్చి పుష్పాయుధు చే
నున్న నెఱవాదియమ్ములఁ, గన్నుల నగుచున్న చెలియ కడకుం జనినన్.

క. అట చని మదిసమ్మద ము, త్తలముగ పఖఁ గౌఁగిలించి కానఁగరా వో
విటవంచని ‖యిన్నిదినము, లెట పోయితి వనిన నదియు నిట్లని పలికెన్.

క. రతిలంపటుఁడును శృంగా, రతిలకుఁడు ననఁగ విటులు రసికత్వమునన్
క్షితిఁ దిరుగుచు §నా వెర వ, స్కృతముగ విని నన్నుఁ గెలువఁ బూనికడంకన్.

క. నా యింటికి నరుదెంచిన, నా యిద్దఱ కేను జందనాగురుకస్తూ
రీయుతముగ నుపచారము, సేయించితిఁ దెక్క¹రముగఁ జిత్తము లలరన్. ౪౦

వ. తదనంతరంబ వారలు కుసుమంబులుం దాంబూలంబులుఁ బుచ్చుకొని యో
విటవంచనీ నీపేరు నిజంబుగ నెటువంటి విటుల నైన మోసపుత్తు వఁట నిక్క
వంబే యని యడిగిన. ౪౦

క. కల్లలు నిజములు ధర్మము, నొల్లంబును బ్రియము మోహమును నలుకయు న
య్యుల్లసము నయము [illegible], జెల్లుచు [illegible]ముందు క్షితిపతులందున్.

* * * * *

---

*మిటు †కర్పూర ఖ్యుఁడన్ ‡గాపదుశ్చే శాపమిం ×కాన కరిగి విరులం దేనొకనాఁ
డిచ్చ- ‖యిన్నాళ్ళ- §నా పేరెత్సత- ¹తేకరముగ-

సీ. మఱియు నొక్కండు బ్రాహ్మణవిటుం డనువరి ననుఁగోరి చనుదెంచి నాకునైన
తగులెల్ల విని నన్ను దర్శింప మఱి యుపాయము లేక సురపొన్న లమరఁగట్టి
మూఁ డెత్తులుగఁ జేసి మును మాలకరి పోలె నేతెంచి నాచేతి కిచ్చినంత
నిరుదెసలం దున్న యిద్దఱ కొసఁగి యం దొక్కటి నేఁ గొన నుత్సహించి
యందుఁ దేనె గ్రోలు నళిఁ జూచి యిదియును
క్షణము సౌఖ్య మొందఁ గాక యంచు
ముడిచికొనక దండఁ దొడఁబూఁద నిడుకొంటిఁ
గ్రొత్తవాని కియ్యకోలు గాఁగ. ౪౭

వ. తరువాత వానికిఁ బసిండిటంకం బిప్పించి నంచిలోఁ బడినయప్పుడు గాని యిది దక్కదని పలికి యాతుమ్మెద ప్రియుఁడు చెడకుండు మార్గమనియొద్దిసు*రపొన్నమీఁద విడిచిపొమ్మని వీఁకకొలిపిన* వాఁడును నట్లు చేయుచుండని మత్సమాగమంబునకుఁ బెక్కువిచారంబులు సేయుచు నెఱజాణయగుటం జేసి.

ఉ. నిష్కము నంచిలోఁ బడుట నీరజమిత్రుఁడు గ్రుంకువేళఁ గాఁ
బుష్కరనేత్ర చెప్పె నళి పొన్నపయి న్విడుమంట లోనికిన్
దుష్కరవృత్తి గా దదియు ద్రోవ చుమీ యని చూపు టయ్యె నే
శుష్కవిచారము ల్వలదు సూర్యుఁడు గ్రుంకిన నంద యేగదన్. ౪౮

క. అని నిశ్చయించుకొను నెడ, వనజాప్తుఁడు పశ్చిమాబ్ధి వారిధిలోన
న్మునుఁగఁగ నెగసిన పొగక్రియ, ఘనముగఁ దిమిరంబు దిశలఁ గనుకని పర్వెన్.

గీ. అంతఁ బ్రొద్దు పుచ్చి యంధకారంబునఁ, బొన్న యెక్కివచ్చి పొంచిపొంచి
జగతిమీఁద నొక్కశయ్యపైఁ బురుషుల, నడుమ నిద్రవోవు నన్ను లేపె. ౫౧

* * * * *

వ. పిదప నయ్యిద్దఱం గదలించి యిప్పుడు నాతోడఁ గ్రీడసల్పినవాఁ డెవ్వండు చెప్పుఁడా యనిన వాండ్రు నొండొరులఁ జెప్పుకొని తారు గాకుండుట దెలిసికొని *కళవళపడి యిది యేమి చోద్యమని విచారించుచు నుండఁగ, నేను, బగలు వచ్చిన మాలకరి యప్పుడు దెచ్చిన మూఁడెత్తులలో నిరుదెసలనున్న మీకు రెంటి నిచ్చి కడమ నాకొసంగిన దండయందుఁ దుమ్మెద సుఖయింపనిమ్మని తొడమీఁద నిడుకొనినభావంబు మీ రెఱుంగరైతిరి.

క. ఆరసికుఁ డెఱిఁగి వచ్చిన, నీరీతుల నడుమఁ గలిసి రెఱుకపడఁగ నా
†చీరలువీడ్వలేచితిమి వి,చారింపఁగ నేల నాదు జయమూఁ గాదో. ౫౨

---

*తక్కులపడి †చీరలు వీడ్వడఁగట్టిన, పాఠస్యం బిదియు వాదుజయ.

క. నావుడు వనితలనెవ్వఁడు, గావంగా నోపు మాప్రకార మెరులకు
నీ వెఱఁగింపకు మని లజ్జావనతముఖాబ్జలగుచు నరిగిరి చెలియా. ౫౭

ఉ. నిన్నటిరాత్రి యీతెఁగులు నీగతి నిచ్చట విశ్రమించుచున్
బొన్నలు గోయవచ్చితి నపూర్వపుఁబంతము వింటివే యనం
బ్రన్నన నవ్వి యీకొలఁది పంతము లెవ్వరుఁ జేయ రవ్విలో
నిన్నిఁకఁ గాముకు న్గెలువనేర్తురె యంచు నుతించె బోటియున్. ౫౮

గీ. ఇట్టిగోష్ఠి వినుచు నేను గూఢంబుగాఁ, దరువుమీఁదఁ బెద్దతడవు నిలిచి
విరులు గోసికొంచు నరిగెడువంతలో, విభుని దేవపూజ వేళ దప్పె. ౫౯

చ. అలుకుచు నేగ నాతఁడు శివార్చనవంచక మాల్యకర్తటి
న్నిలిచి దినంబు మానవుల నెత్తురుద్రావెడి శోణితప్రియం
గొలిచి మనుష్యహంత వయి కోవిలలోపల నుండుమంచు న
న్నలిగి శపించె నీశ్వరనిరాకరణం బిది రిత్తవోవునే. ౬౦

వ. అపుడు వడవడ వడంకుచు నేనపరాధి నైతిని బుద్ధ్యాకార్యంబు వదలి దుర్గోష్ఠి విన్నదానికి ఫలం బిపుడిట్లయ్యె దేవర యానతి తప్పునా నాకెన్నండు శాపావధి యానతిమ్మని మ్రొక్కిన భవసఖుండు గొంత ప్రసన్నుండై నీవా దేవతం గొలిచి తత్ప్రియ నుండంగ నెప్పుడే నొకవీరుండు నరబలి మాన్పింపం దాఁ జేరువయ్యెడి నప్పుడా దేవిచేత శస్త్రహతిని శాపముక్తుండవు గమ్ము పొమ్మనిన- ౬౧

క. ఖేచరభావం బుడిగి వ, నేచరభావమున నిట్లు నిచ్చలు జనుల
న్నీచుండ నై వధియించుచు, నీచేతం బూర్వపదము నేఁడిదె కంటిన్. ౬౨

మ. అనుచుం జెప్పి కుబేరకింకరుఁడు దా నాకాశమార్గంబునం
జనియెం గ్రమ్మఱ శోణితప్రియయు నాక్ష్మాపాలు నగ్గించి నీ
మనమార న్మను గోరనట్టికొలఁది న్మర్త్యోపహారంబు నై
కొను టే మానితి నారికేగు మని వీట్కొల్పెం బ్రసన్నాత్మయై. ౬౩

వ. తదనంతరంబ- ౬౪

ఉ. దేవతఁ జూచితిన్ జనులఁ దింటయు మాన్పితి యక్షభృత్యున
ద్భావము నొందఁ జేసితి ముదంబిట చేకుఱె నంచు వీటి కు
ర్వీవరుఁ డేగుదెంచె నిఁక వింటివె వేగమ నీవు నింటికిం
బోవుట మేలనంగ విని †భోజనృపాలుఁడు క్రమ్మఱె న్వెసన్. ౬౫

---

†భోజుఁడు క్రమ్మఱ నేగె లోనికిన్.

—। ఇరువదితొమ్మిదవబొమ్మకథ ।—

క. అంభోధిశయను గమలా,సంభోగప్రౌఢు నబ్జసంభవగురునిన్
జంభారివినుతగుణసం,రంభాటోపాంధకారకరాళజ్వాలిన్. ౬౬

మ. తనచిత్తాబ్జములోఁ దలంచి మతిశౌర్యధాత్రీశుఁ డాపాలికా
ననుసింహాసన మెక్కవచ్చిన సముత్సాహంబు వారించి కాం
చనపాంచాలిక వక్త్ర దానగుణవిస్తారంబున న్సాహసాం
కుని సాదృశ్యము నొందలేక యిది నీకుం జెల్లునే పార్థివా. ౬౭

క. అతనిదానము భువన,ఖ్యాతము సకలోపకారకారణము దయా
చాతుర్య*తుర్యవిధము,త్యాతతధనకనకసముదయాకరము భువిన్. ౬౮

క. త్యాగంబున సత్కీర్తియు, యోగంబున ముక్తిసతియు నుచితం బగును
ద్యోగంబున సంపదయును, భోగంబున సుందరియుఁ బొందినఁగూడున్.

క. అనుచును త్యాగము యోగం,బును నుద్యోగంబు నిష్టభోగంబును బెం
పొనగూడఁ దగినకాలం,బున జరపుచు నవ్విభుండు భువి యేలంగన్. ౭౦

చ. ఉరగము లెల్ల శేషులు పయోనిధు లెల్ల సుధాబ్ధు లీటు లం
బరనదు లద్రు లారజతపర్వతముల్ గ్రహములు సుధాకరు
ల్తరువులు కల్పవృక్షములు దైవతసంఘము లన్నియు న్మహే
శ్వరు లనఁ జెల్లె నల్లెడల †సాహసభూషణుకీర్తివర్తనన్. ౭౧

ఉ. అట్టిదినంబుల న్నృపులు నాశ్రితులుం గవితారసజ్ఞులుం
జుట్టలు మంత్రులుం దొరలు శూరులు వీరులుఁ గొల్చియుండఁగా
దిట్టతనంపుఁబ్రోక యనఁ దేఁకువ కెక్కి విదేశవర్తి యా
బట్టొకఁ డేగుదెంచి జనపాలశిఖామణిఁ గాంచి పెల్లుగన్. ౭౨

సీ. బ్రహ్మయు వని రాజుఁ బ్రస్తుతిచేసి తదాజ్ఞ సుఖాసీనుఁ డై భజించి
కవితయు సర్వలక్షణపరిజ్ఞానంబు సత్యవాదమును ధీచాతురియును
జాగంబు శౌర్యంబు సరసోక్తియును నాఁగ నియ్యేడుగుణముల నెన్నఁబడ్డ
చండపుత్రుండఁ బ్రచండవాచాలుండఁ జండపురాణదీక్షాగురుండ
నవనిపాలు రెల్ల నరిగాఁపులట్ల నా, కిచ్చుధనము లెల్ల నియ్యకొనుచు
నుత్సవమునఁదిరుగుచుండి యీజగములో, నినుమహాప్రదాతయనఁగవింటి.

---

*చాతుర్యవిదితచరిత, †సాహసభూషణుఁ డుర్వి యేలఁగన్.

సీ. సత్కీర్తి సతికిని సత్పుత్రికి లోపల భువనత్రయంబును బొదలుచుండు
గావున నింతకు నీ వితండ్రివి నీదుధనము యాచకులకుఁ దల్లి సుమ్ము
తమపితృధనము లేలేటి నైనఁ గైకొన్న నది భాగమని భువి నెన్నఁబడును
తనకుటుంబముఁ బ్రోవఁదా నెంత ప్రియపడ్డ నతఁడు మహోదారుఁడనఁగఁ దగునె
తగదుగాని నీయుదారత్వమేమని, పొగడవచ్చుఁ *దొంటిరంతు పొంటెఁ దలఁప
శమితకుజనతర్క జయురమాసంపర్క, విమతకైరవార్క విక్రమార్క. ౨౪

క. జలములు పైఁబడక మహా,నల మాఱకు శౌర్యభూమనా నీకోపా
నలము రిపుసతులకన్నుల, జలములు గనియాఱు నెంతచిత్త్రం బిచటన్. ౨౫

క. కావున యశముఁ బ్రతాపము, నేవిరపునఁ బొగడఁజెల్లు నెవ్వరి సరిగాఁ
గావింపవచ్చు దీనులఁ, గావం బ్రోవంగ నీవె కారణమగుటన్. ౨౬

ఉ. దేవసమాన నిన్ను వినుతించుట వాంఛితసిద్ధి భూమిలో
నేవసుధేశు నీమెకుట నెన్నఁగవచ్చు మదీయజిహ్వ ల
జ్జావశ మై చలింప దిఁక సద్గుణముండలి సద్గుణాఢ్యుఁ బ్ర
స్తావన చేయనేరని యుతం డతిమూఢుఁడు గానఁ జెప్పెదన్. ౨౭

గీ. విపులదుర్గమైన వింధ్యపర్వతసీమఁ, జంద్రకాంతసౌధజాలరుచుల
రాజపురము తోడ రాయుచు నుంచిన, రత్నపురము నాఁబురంబు గలదు ౨౮

క. ఒకటొకటికంటెఁ బొడవునఁ, బ్రకటముగా నచటిహర్మ్యపంక్తులు దివి ము
ట్టికలశధవు చేవింధ్యా, ద్రికిఁగృతమున నైన కొఱఁతఁ దీర్చుచునుండున్.

క. అందు జయసేనుఁ డనఁగఁ బు, రందరవైభవుఁడు †రాజరాజనాథ్యుం
డిందుధరభక్తినిరతుఁడు, వందిజనప్రియుఁడు మనుజవల్లభుఁ డుండున్. ౩౦

క. ఆనరనాయకు వేఁడిన, దీనులు ధనవంతు లగుచు దేశములోన
న్మానవనాథుల క్రియ నతి,దానంబులఁ బరఁగుదురు ప్రదాత లనంగన్. ౩౧

సీ. అట్టివిజయసేనుఁ డధికసంపత్తితో నొకనాఁడు నవవసంతోత్సవంబు
సేయ నుద్యోగించె నాయవసరమునఁ గవులును బట్లును గాయకులును
నర్తకులును నిజకీర్తి నుతించుచు సరసభావంబున సరవ నడువఁ
జెలువార వారకాంతలు సుగంధద్రవ్యహస్తలై కెలఁకుల నరుగుదేర
దొరలు లెంకలు హితులు మంత్రులును గొలువ, నశ్వరత్నము నెక్కియుద్యానభూమి
కేగి యచ్చటనొకపాదరింట్రిక్రేవ, సురుచిరంబగు మాకందతరువుక్రింద. ౩౨

* తొంటిపొందెరలప. † రాజరాజాదావ్యం.

శా. అర్పింపందగు పూజలెల్లఁ దగుమర్యాద న్సమర్పించి కం
దర్పుం దప్రియమిత్రుని న్సముచితోత్సాహంబునం గొల్చి యే
కార్పణ్యంబును లేక యింపెసయఁగాఁ గాశ్మీరకస్తూరికా
కర్పూరాదివసంతఖేలనములుం గావించె నుల్లాసియై. ౧౩

క. జనవరుఁ డయ్యుత్సవమున, మనములరఁగ యాచకులకు మాడలు పదివే
లును దొమ్మిదిలక్షలు గ్రక్కునవిచ్చెం గీర్తి దిశలఁ గొనసాఁగంగన్. ౧౪

వ. ఆసమయంబున- ౧౫

ఉ. యాచకకల్పభూజ మగు నానరనాథు మహావదాన్యునిం
జూచితి వానిచేత నిలు చూఱలు గొన్నగతి న్నవస్తువు
ల్నాచతురత్వచిహ్నములు నాఁ గయికొంటి నతండు ధాత్రిలో
రాచగొనంబులం బగఁగురా జపుఁ గావున నెన్న నొప్పగున్. ౧౬

ఉ. అంచు నతండు రత్నపురియందలి మండలనాథచంద్రుఁ డ వ
ర్ణించిన నయ్యవంతిధరణీధరుఁ డాతని చాగ మాత్మలోఁ
గొంచెముగాఁ దలంచి *నిజకోశగృహాధిపుఁ డైన లెంక నీ
క్షించి యనంతదానగుణశీలసమగ్రత †నత్యుదారుఁడై. ౧౭

చ. ఇతని కనర్ఘ్యరత్నములయిండ్లుఁ గాంచనమందిరంబులుం
జతురతురంగసద్మములు సామజశాలలు నూపురాద్యలం
కృతిసదనంబులు న్వసనగేహములుం బరిపాటిఁ జూపు స
మ్మత మగువస్తుజాతము సమస్తమునుం గొనిపోవని మ్మటన్. ౧౮

క. అనవుఁడు భాండాగారికుఁ, డును విస్మయమందుచుం గడుం బ్రియ మడరం
దనలోన వెఱఁగుపడ నా, తనిఁ దోడ్కొని యరిగి వరుసఁ దద్గృహములలోన్.

వ మదశుకానుకృతంబు లగు మరకతంబులు ను, బరిపుష్పరాగంబు లగు పుష్పరాగంబులు ను, ధామాధికంబు లగు గోమేధికంబులు ను, ప్రభాసఫలంబు లగు ముక్తాఫలంబులును, విడంబితబాలప్రవాళంబు లగు ప్రవాళంబులును, నదృష్టవైడూర్యంబు లగు వైడూర్యంబులును, ఘననీలనీలంబు లగు నీలంబులును, రుచిరజితవజ్రంబు లగు వజ్రంబులును, గల్పితపద్మరాగంబులగు పద్మరాగంబులును, నవధీరితమేరుశిఖరంబు లగు కనకశిఖరంబులు ను, నధరీకృతార్క్షవాజు లగు తేజులు ను, నుపమితదిగ్గజంబు లగు

* నిజకోశగృహస్థుఁడైన- † నత్యుదగ్రుఁడై.

మత్తగజంబులు ను, గర్ణి కారసువర్ణాకారంబు లగు సువర్ణాలంకారంబులును, నానాంశుకంబు లగు చీనాంశుకంబులు ను, గనుపట్టం జూపిన నవ్వందివరుండు ని వ్వెఱఁగంది తత్త్యాగసంపదలకుం గంపితశిరస్కుం డై యుండుండన కావటం బగువానిం గొనిపోవం దలంచి. ౯౦

క. అనుచరులచేత మణులును, గనకము మూటలుగఁ ద్రుప్పఁ గట్టించి నృపా
లుని గర్ణుని మీఱితి వని, కొనియాడుచు నర్థ మెల్లఁ గొనుచుం జనియెన్.

ఉ. ఆతఁడు చన్నపిమ్మటఁ దదర్థగృహస్థితుఁ డైన లెంక సం
ప్రీతమనస్కుఁ డై నృపుని పెంపు మనంబున సన్నుతించుచు
నీతియు భీతియుం గలుగ నేరుపు చొప్పడ విన్నవించె న
త్యాతత మైన యాజ్ఞ వినయంబునఁ జేతులు మోడ్చి నమ్రుఁడై. ౯౧

క. తనియంగఁ బట్టుకొనిపో, యినయర్థము కొలఁది మీరు నెఱుఁగఁగవలయు
న్వినిపించెద నవుడు న,మ్మనుజేంద్రుఁడు చులుకఁ జూచి మందస్మితుఁడై.

క. చనువాఁ డని నే నిచ్చిన, చనవునఁ గొని చన్నధనము సంఖ్య యెఱుంగం
బనిలే దిఁక నాయర్థము, కొని యేగినవాఁడె యెఱిఁగికొన్నం జాలుఁ. ౯౪

సీ. అనుడు నాలెంకయు నాశ్చర్యమందుచు ధరణీశ నీకు నుదారమతికి
నిప్పటియాఁకటి యొప్పు న ట్లయ్యును బలికెద నాదు విన్నపంబు వినుము
మయి లెక్కకాండ్రను గయికొల్పి వెఱపించి లెంక విశ్వాసంబు బొంకు చేసి
ధన మెంత గల్గినఁ దాఁ జల్లఁ జూడక యాయవ్యయంబుల నడుగవలయు
వాని వివరమెల్ల వర్గువుగాఁ గూర్చి, నెఱయఁ దెలుపు లెక్క లెఱుఁగుకొనుచు
వ్యయముపుచ్చి నిలువ వ్రాయించికైకొంట, ప్రభుల కిదియ నీతివిభవమండ్రు.

గీ. వ్రాఁతకాని నమ్మరా దర్థగృహముల, నుంచకున్న నేమి యొక్కనాఁడె
పెరను గూడుమనినఁ గరణము పండిత, న్యాయమునఁ గనర్థుచటఁ దెచ్చు.

క. ఒకదెసఁ దెచ్చిన యాయం, బొకదిక్కునఁ జెల్లువ్రాసి యొకదెసవ్యయ మ
ట్లొకదిక్కునఁ జనవ్రాసినఁ, బ్రకటంబుగ వాఁడు మిగులఁ బాపాత్ముఁడగుఁ.

క. వహి వారణాసి యనఁగా, మహిఁబరఁగిన దిండుఁ గపటమార్గంబుగ నా
గ్రహమున వ్రాసినవానికి, నివావరములు లేవు నరక మెదురై యుండుఁ.

గీ. రానిపైఁడి చెల్లువ్రాయుట యాయంబు, తక్కునై వ్యయం బదెక్కుడౌట
లెక్క తుదుపువడుట లిపి సందియం బౌట, చెల్లు మఱచుటయును గల్లతనులు.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు—ప్రతిష్ఠాపకులు.

శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు, పిఠాపురము మహారాజా
వారు. పరిషద్వ్యవస్థాపకాధ్యక్షులు.
కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు.
కీ. శే. రాణీ వత్సవాయ వేంకట సుభద్రయ్యమ్మ జగపతిబహద్దరుగారు.
కీ. శే. శ్రీబొబ్బిలి మహారాజావారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకవర్గము.

### అధ్యక్షులు.

జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. ఎల్.
వింజమూరి వెంకన్నపంతులుగారు ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహదర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారు.
పెద్దాడ రామస్వామిగారు, ఎం ఏ. (కోశాధ్యక్షులు.)
చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.
కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.
శ్రీమాన్ గోడవర్తి జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., యల్. టి.
దర్భా వేంకటశివరామరాజుగారు, బి. ఏ., బి. ఎల్.
అళక్కి వేంకటాద్రియయ్యగారు.
కేశవంపు కామరాజుగారు.
కోశా వేంకటసుబ్బారావు నాయుడుగారు.
ఓలేటి వేంకటరామశాస్త్రిగారు, శతావధాని.
పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారు.
పిళ్ళారిశెట్టి రంగబ్రహ్మరావు నాయుడుగారు.

PYDA VENKATACHELAPATI TELUGU MANUSCRIPT

PRINT FUND SERIES No. 1.

# సాంబోపాఖ్యానము.

---

శ్రీకృష్ణదేవరాయల యల్లుఁడగు

అళియరామరాజునకుఁ బెద్దతండ్రిమనుమఁడగు

## రంగప్పరాజకవి రచించినది

వసుచరిత్ర కళాపూర్ణోదయములకంటెఁ బూర్వప్రబంధము.

చిత్రశ్లేషలకు నిలయము. అత్యద్భుతవర్ణనలగని. స్వభావోక్తులకు నిధి.

నిర్దుష్టమైనది.

కథ- శ్రీకృష్ణజాంబవతుల తనయుఁ డగు సాంబునకును

దుర్యోధనునిపుత్రియగు లక్షణకును వివాహము.

## రాజకవిత్వము, ప్రబంధరాజము

భాషాభిమాను లెల్లరుఁ జదువఁదగినది.

రాయల్ 186 పుటలు- అయిదాశ్వాసములు.

పోస్టువ్యయము గాక- వెల రు 1—0—0 మాత్రమే.

## దొరకుచోటు

## ఆంధ్రసాహిత్యపరిషత్తు- కాకినాడ

Printed by N. Achutaramiah at the Cocanada Printing works, Cocanada.